NEW !



సెప్టెంబర్ 2022

# గురువాణి

శ్రీవిద్యా జ్ఞాన పీఠం ఆధ్యాత్మిక మాస పత్రిక

శ్రీవిద్యకు సంబంధించిన
## దేవాలయాలు

## ఆర్థిక సమస్యలకు
అద్భుత పరిహారం

## పంచదశి
## ఖడ్గ మాల సాధన

గురువాణి
మాస పత్రిక
ప్రారంభం





# సిద్ధ లక్ష్మీ సమేత శ్రీ వల్లభ శ్రీ మహా గణపతి ధ్యానం

బీజాపూర గదేక్షు కార్ముక రుజా చక్రాబ్జ పాశోత్పల|
వ్రీహ్యాగ్ర స్వవిషాణ రత్నకలశ ప్రోద్యత్ కరాంభోరుహ||
ధ్యేయో వల్లభయా సపద్మకరయా శ్లిష్టోజ్జ్వలద్భూషయా|
విశ్వోత్పత్తి విపత్తి సంస్థితి కరో విఘ్నేశ ఇష్టార్థదః||

# గురువాణి
విషయ సూచిక



## ఈ సంచికలో

**గురూజీ దివ్య సందేశము** | **పంచదశీ ఖడ్గమాలా సాధన** | **ఆర్థిక సమస్యలకు అద్భుతమైన పరిహారం**



**కవర్ పేజీ చిత్రము** – శ్రీ శ్రీ శ్రీ అమృతానంద నాథ సరస్వతి గారు, దేవిపురం






గురువాణి అనే ఈ డిజిటల్ తెలుగు మాస పత్రిక, శ్రీవిద్య లెర్నింగ్ సెంటర్ వారిచే ముద్రించబడినది.



శ్రీవిద్య లెర్నింగ్ సెంటర్,
(సౌందర్య లహరి యొక్క ఒక విభాగము)
#69, 6th Cross Street, Girinagar Phase I,
Bengaluru, KA 560085, India.
Phone: +91 8088256632


    



# శ్రీ విద్యా సాధకులందరికీ స్వాగతం, సుస్వాగతం.



## శ్రీ మాత్రే నమః

ఇప్పటి నుండి మేము ఈ మాస పత్రిక ద్వారా మీకు సమాచారాన్ని అందిస్తూ జగన్మాత యొక్క శ్రీవిద్యకు సంబంధించిన జ్ఞానాన్ని అందరితో పంచుకుంటూ, అందరు సాధకులనూ ఒకే గొడుగు క్రిందకు తేవాలని అనుకుంటున్నాము.

మనం చేసే సుదీర్ఘ ప్రయాణంలో ఎక్కువగా సాధన మీద దృష్టి కేంద్రీకరిస్తూ, మన అనుభవాలను ఇతరులతో పంచుకోవడానికి ఈ సమాచార పత్రిక ఒక మార్గం అవుతుంది. ఇది, మన పరమ గురువు (అనగా నా శ్రీ గురువు) శ్రీ శ్రీ శ్రీ అమృతానంద నాథ సరస్వతి గారి స్వప్నం .

అట్లాంటిక్ మహా సముద్రం మధ్యలో చేసిన హోమం, అమెరికాలోని మౌంట్ వాషింగ్ టన్ పర్వత శిఖరం మీద చేసిన హోమం, 67,600 చదరపు అడుగుల మేరకు నేలమీద చిత్రీకరించబడిన పృధ్వీ శ్రీ యంత్రంలో 1000 మందికి పైగా సాధకులచే చేయించిన లలితా హోమం,.... ఇలా నా జీవితంలో, వైవిధ్యమైన పూజలతో అమ్మను సేవించే భాగ్యము, శ్రీవిద్యా ఉపాసకులకు కాక మరెవరికి లభ్యం అవుతుంది?

ఈ మాస పత్రిక మీ సాధనకు ఎంతో సహాయ కారిగా ఉంటుందని, చాలా రోజుల నుండి సాధన చేస్తున్న శిష్యుల అనుభవాలు తెలియజేయబడి, మిమ్మల్ని సరైన మార్గంలో గమించేదుకు ఉత్సాహపరుస్తూ ఉంటుందని, నేను అనుకుంటున్నాను. **రండి. మనం అందరం కలసి, ఈ శ్రీవిద్యా జ్ఞాన సాగరంలో ఓలలాడుతూ, సంతోషమయమైన జీవన విధానాన్ని అలవరచుకుందాము.**

శ్రీ మాత్రే నమః

ప్రేమాశీస్సులతో,

Guru Karunamaya



# దైవ నిర్ణయాన్ని ప్రతిఘటించకుండా, ఒప్పుదల మార్గంలో జీవించడమే శ్రీవిద్యా సారం

మనలను సృష్టించిన జగదంబ ఎల్లప్పుడూ మన గురించి జాగ్రత్తలు తీసుకుంటూ ఉంటుంది. ఆమెను పూర్తిగా నమ్మినప్పుడు, మనము ఇంక ఏమీ చేయనవసరం లేదు. మన సంసారమనే భారాన్ని కూడా అమ్మే మోస్తుంది. సర్వస్వం ఆవిడకే వదిలేయాలి.

నా జీవితాన్నే తీసుకోండి. చిన్నతనంలో నేను ఒక డాక్టర్ కావాలి అనుకున్నాను. కానీ ఇంజనీరింగ్ చదివాను. 18 సంవత్సరాలు ఉద్యోగం చేసిన తరువాత, న్యూజిలాండ్ కు వెళ్లి అక్కడ ఒక టెలీ మార్కెటర్ (telemarketer) గా పని చేశాను. కొన్ని సంవత్సరాల తరువాత న్యూజిలాండ్ ప్రభుత్వ కార్యాలయంలో ఒక కస్టమర్ కేర్ ఆఫీసర్ (customer care officer) గా పని చేశాను. తరువాత, అమెరికాకు వెళ్లి అక్కడ ఒక సాఫ్ట్ వేర్ డెవలపర్ (software developer) గా పని చేశాను. అక్కడ పని చేస్తూ ఉండగా, నా గురువు గారు నన్ను పిలిచి, దేవీపురంలో ఉన్న పీఠానికి పీఠాధిపతిగా నియమించారు.ఇలా నేను, అమ్మ ఆజ్ఞతో అనేక ప్రదేశాలలో అనేక పదవులను నిర్వహించాను, కానీ, ఎప్పుడూ ఈ మార్పును నేను నిరోధించలేదు. అదే నా రహస్యం. అమ్మ ఎటు తీసుకువెళితే అటు ప్రయాణం చేస్తూ వచ్చాను.

నేను నా జీవితంలో ఎదురయ్యే సంఘటనలను నిరోధించడానికి ఎప్పుడూ ప్రయత్నించలేదు. కాకపోతే, ఎదుర్కొనే శక్తినిమ్మని తరచూ ప్రార్థించేవాడిని. భగవంతుడి క్రియలను నిరోధించాలనుకుంటే, బాధలు ఎదురవడం సహజం. భౌతిక శాస్త్రంలో ఘర్షణ వలన అగ్ని పుడుతుంది అని నేర్చుకున్నాము కదా.

అందువల్ల ఎప్పుడూ నిరోధించవద్దు. ఎలా జరిగితే అలా జరగనివ్వండి. ఒక్కటి మాత్రం నిశ్చయం. అమ్మ పాదాలను ఎప్పుడూ నమ్ముకుంటే, మనలను, సురక్షితమైన, సూక్ష్మమైన, ప్రశాంతమైన మార్గంలో మన గమ్యానికి చేరుస్తుంది. ఇది తథ్యం.

శ్రీ మాత్రే నమః





# పంచదశీ ఖడ్గమాలా సాధన



ఖడ్గమాల అనేది ఒక అమోఘమైన, శక్తివంతమైన మాలా మంత్రము. ఈ మంత్రము ద్వారా శ్రీ చక్ర ఆవరణ దేవతలతూ కూడి సర్వానందమయ చక్రంలో విరాజిల్లుతున్న మహా త్రిపుర సుందరీ అమ్మవారి ఆవాహన చేయబడి, ప్రాపంచిక, ఆధ్యాత్మిక సాధనా మార్గములలో అవరోధాలు తొలగించబడతాయి.

ఖడ్గమాలా స్తోత్రములో 15 (పంచదశి) రకాల ఖడ్గమాలా స్తోత్రములు ఉన్నాయని చాలామందికి తెలియదు. ఈ పంచదశీ ఖడ్గమాలా స్తోత్రములను సరైన పద్ధతిలో సాధన చేయుట ద్వారా జీవితంలో సుఖశాంతులను పొందవచ్చును.

మొత్తం 15 ఖడ్గ మాలలు ఉన్నాయి. వీనిలో 5 మాలలు శక్తికి, మరొక 5 మాలలు శివునికి, మరొక 5 మాలలు మమేకమైన శివశక్తులకు అనుసంధానమై ఉన్నాయి.

శక్తి, శివ మరియు శివశక్తి రూపాలలో ఉన్న ఈ మూడు భాగాలలో మాలలు క్రింది విధంగా ఉంటాయి.

1. **శుద్ధ మాల** – సాధారణంగా మనం అందరం పఠించే ఖడ్గమాల.
2. **నమోంత మాల** – దీనిలో ప్రతి నామం చివర "పూజయామి నమః" అని పఠించబడుతుంది.
3. **స్వాహాంత మాల** – దీనిలో ప్రతి నామం చివర "స్వాహా " అని పఠించబడుతుంది.
4. **తర్పణాంత మాల** – దీనిలో ప్రతి నామం చివర "తర్పయామి నమః" అని పఠించబడుతుంది.
5. **జయాంత మాల** – దీనిలో ప్రతి నామం చివర "జయ జయ" అని పఠించబడుతుంది.



ఈ పంచదశీ ఖడ్గమాల పారాయణ ఒక నిర్ణీత కాల వ్యవధిలో చేయవలెను. అది కూడా చాంద్రమానం లో అమావాస్య తరువాత వచ్చే పాడ్యమి నుండి ప్రారంభించవలెను.

పారాయణ చేయడానికి పంచదశీ ఖడ్గమాలలు, పారాయణ విధి, ఇతర వివరాలు Srimeru website నుండి డౌన్ లోడ్ చేసుకోవచ్చును.



సంపుటి -1 సంచిక - 1

# ఆర్థిక సమస్యలు తొలగిపోవడానికి అద్భుతమైన పరిహారం

## ఏలకుల మాల అలంకార పూజ



నిత్య జీవితంలో, మనలో చాలా మంది ఆర్థిక సమస్యలను ఎదుర్కొంటూ ఉంటారు. అటువంటి ఆర్థిక సమస్యలను నివారించడానికి ఒక శక్తివంతమైన పూజ ఉన్నది. అదే ఏలకుల మాల అలంకార పూజ. ప్రతి శనివారం వెంకటేశ్వర స్వామి విగ్రహానికి ఈ పూజను చేయాలి. ఒక సంవత్సరం పాటు ప్రతి శనివారం ఈ పూజను చేయాలి. ఈ పూజావిధానం క్రింద వివరించబడింది.

గురుధ్యానం, గణపతి ధ్యానం, ఆచమనం, ప్రాణాయామం సంకల్పం చేసిన తరువాత 27 ఏలకులను ఒక పళ్లెంలో తీసుకోవాలి. దానిపై పసుపు నీటిని పోసి 10 సెకన్ల పాటు నాననివ్వాలి. (ఎక్కువ సేపు నానితే మరలా ఏలక్కాయలు విడిపోతాయి. కనుక జాగ్రత్త వహించాలి.)

ఒక సూదిలో తెల్ల దారం గ్రుచ్చుకోవాలి. ఒక ఏలక్కాయను తీసుకుని నెమ్మదిగా ఆ కాయను దారానికి ఎక్కించాలి. ఇలా ఎక్కించేటప్పుడు "ఓం నమో నారాయణాయ" అనే అష్టాక్షరీ మంత్రాన్ని నెమ్మదిగా చదువుతూ చేయాలి. ఈ విధంగా 27 ఏలక్కాయలను ఎక్కించాలి. మాల తయారైన తరువాత, మాలను రెండు చేతులతో పట్టుకుని, క్రింది శ్లోకాలను చదవాలి.

**"శ్రియః కాంతాయ కల్యాణ నిధయే నిధయేర్థినాం,**
**శ్రీ వేంకట నివాసాయ శ్రీనివాసాయ మంగళం.**

**మంగళా శాసన పరై ర్మదాచార్య పురోగమైః**
**సర్వైశ్చ పూర్వరాచార్యైః సత్కృతాయాస్తు మంగళం.**

**సర్వ మంగళ మాంగళ్యే శివే సర్వార్థ సాధికే**
**శరణ్యే త్ర్యంబకే దేవీ నారాయణి నమోస్తుతే."**

ఈ శ్లోకములు చెప్పి, తరువాత ఏలక్కాయల మాలను వేంకటేశ్వర స్వామి విగ్రహం మెడలో వేయవలెను. తరువాతి శనివారము నాడు, స్వామి మెడలో ఉన్న మాలను తీసి, కొత్త మాలతో పైన వివరించిన పద్ధతిలో మరలా పూజించ వలెను. స్వామి మెడలో నుండి తీసిన మాలను ఒక డబ్బాలో లేదా సీసాలో భద్రంగా ఉంచవలెను. ఏలకులు పాడైపోకుండా ఉండటానికి, ఈ మాల ఉన్న సీసాలో కొంత కర్పూరాన్ని ఉంచవలెను.

ఈ విధంగా 40 లేదా 50 మాలలు తయారైన తరువాత, ఈ మాలలను ఆహుతులుగా ఉపయోగిస్తూ, నారాయణ హోమమును చేయవలెను. ఆహూతులుగా వేసే ఒక్కొక్క మాలను, నేతిలో ముంచి ఆహుతులుగా అగ్నికి సమర్పించవలెను.

ఈ విధంగా క్రమం తప్పకుండా ఒక సంవత్సరం పాటు ఈ పూజ చేసిన వారి ఆర్థిక సమస్యలు చాలా వరకు పరిష్కారం అయినాయి.

నారాయణ హోమం గురించిన పూర్తి విధానము Srimeru website లో పొందుపరచబడినవి. ఈ పూజ గురించిన వీడియో ఒకటి తరువాతి పేజీలో పోస్ట్ చేయబడినది.








ఏలకుల పూజ వీడియో

# చిన్నపిల్లలో తెలివితేటలు పెరిగేదెలా?

మీ పిల్లలో తెలివితేటలను పెంచడం కోసం వారికి, వాగ్దేవతా న్యాసం (గురువు గారి చే నేర్పబడినది) అనే చిన్న ప్రక్రియను నేర్పవలెను. దీనికి సంబంధించిన సూచనలు ఈ క్రింది వీడియోలో ఇవ్వబడినవి. మంచి ఫలితాలు రావడానికి, ఈ న్యాసమును ప్రతి రోజూ, ఒకే స్థలములో ఒకే సమయములో అభ్యాసం చేయాలి. ఈ మంత్రమును గురుముఖంగా తల్లి స్వీకరించి, పిల్లల చేత అభ్యాసం చేయించవచ్చును.




వాగ్దేవతా వీడియో





# వారాహి దేవాలయము, వారణాసి



**కాశీ విశ్వనాథాలయం నుండి నడిచి వెళ్లగలిగేంతటి దూరంలో భూగర్భంలో ఒక గుప్తమైన వారాహీ దేవాలయము ఉన్నది.**

అష్ట మాతృకా దేవతలలో వారాహీ దేవి ఒకరు. ఈమె, శ్రీ లలితా త్రిపుర సుందరి యొక్క సైన్యాధిపతి. శ్రీ లక్ష్మీ దేవి యొక్క మరొక రూపమే శ్రీ వారాహీ దేవి. శ్రీ లక్ష్మీ దేవి శుభములు కలిగిస్తే, శ్రీ వారాహీ దేవి అశుభాలను తొలగిస్తుంది.

శ్రీవిద్య లో వారాహీ మంత్రము చాలా శక్తివంతమైనది. ప్రశాంతత కొరకు, వైవాహిక జీవితంలోని సమస్యలు పోగొట్టడానికి, దీర్ఘ కాలిక వ్యాధుల నుండి విముక్తి పొందడానికి, కోర్టు వ్యవహారములలో ధర్మ బద్ధమైన విజయాన్ని పొందడానికి, ఈ మంత్ర సాధన ఉపయోగపడుతుంది. సాధన సరిగా సాగడం కోసం, ఈ మంత్రాన్ని గురువు వద్ద దీక్షగా తీసుకోవాలి.

శ్రీ వారాహీ దేవి మందిరము కాశీ విశ్వనాథుని మందిరం నుండి నడిచి వెళ్లేంత దూరంలో, భూగృహంలో ఉన్నది. కాలభైరవుడు క్షేత్రపాలకుడైతే, శ్రీ వారాహీ దేవి కాశీ క్షేత్రమునకు క్షేత్ర పాలిక. ఈవిడను పాతాళ భైరవి అని కూడా అంటారు.

ఇక్కడ ఉన్న శ్రీ వారాహీ దేవి మందిరము రోజూ ఉదయం 5.30 గంటల నుండి 7.30 గంటల వరకు మాత్రమే (కేవలం రెండు గంటలు) తెరువ బడుతుంది. మిగిలిన సమయం అంతా ఈ మందిరం మూసి ఉంటుంది. అనాదిగా వస్తున్న ఆచారం ప్రకారం, అక్కడే నివసిస్తున్న పూజారి మాత్రమే బ్రాహ్మీ ముహూర్తంలో మెట్లు దిగి క్రిందికి వెళ్లి అమ్మవారికి అభిషేకం చేసి, అలంకారం చేసి, పూజ పూర్తి చేస్తారు. భక్తులు, మందిరం పై భాగంలో ఉన్న రెండు రంధ్రముల ద్వారా మాత్రమే అమ్మవారి ముఖము, పాదములను దర్శించుకోవచ్చును.

శ్రీ విద్యా సాధనలో వారాహీ సాధన చాలా ముఖ్యమైనది. అమ్మవారి ఆశీస్సులు కోరిన వారిని శ్రీ వారాహీ అమ్మ అన్ని విధాలుగానూ రక్షిస్తుంది.

**మందిరం ఉన్న స్థలం**

శ్రీ కాశీ విశ్వనాథుని ఆలయం నుండి షుమారు 700 మీటర్ల దూరంలో మన్ మందిర్ ఘాట్ దగ్గరలో [శ్రీ వారాహీ దేవి మందిరం] ఉన్నది.



# ఈ మధ్య కాలంలో జరిగిన కార్యక్రమాలు





## గురు పూర్ణిమ

జులై 13న హైదరాబాద్‌లోని టీటీడీ కల్యాణ మండపంలో, గురు పరంపరకు నివాళిగా గురు పూర్ణిమ వేడుకలను శ్రీవిద్యా సాధకులు ఘనంగా నిర్వహించారు. మన ప్రియతమ గురూజీ శ్రీ గురు కరుణామయ గారు సాధకులకు గురు మంత్ర దీక్షను ఇచ్చారు.

ఈ కార్యక్రమంలో భాగంగా గురువుగారి మార్గదర్శకత్వంలో శిష్యులు 108 శ్రీ యంత్రాలకు సామూహిక ప్రాణప్రతిష్ఠ చేసారు. సాయంత్రం గురు హోమం ఘనంగా నిర్వహించారు. ఈ పవిత్రమైన రోజున గురూజీ మరియు గురు అమ్మ (అరుణాంబ గారు) శ్రీవిద్యా సాధకులను ఆశీర్వదించారు.

## చండీ హోమం, శ్రీశైలం

శ్రీశైల జ్యోతిర్లింగ క్షేత్రంలో జూలై 16 మరియు 17 తేదీల్లో గురూజీ ఆధ్వర్యంలో నిర్వహించిన చండీ హోమంలో పాల్గొనే జీవితకాల అవకాశం శ్రీవిద్యా సాధకులకు లభించింది. ఆస్ట్రేలియా, దక్షిణాఫ్రికా, జర్మనీ మరియు అమెరికా దేశాలతో పాటు భారతదేశంలోని అనేక రాష్ట్రాల నుండి శ్రీవిద్య ఉపాసకులు మరియు భక్తులు ఇందులో పాల్గొన్నారు.

ఈ బృహత్తర కార్యక్రమంలో ఏర్పాటు చేసిన పది వైదిక హోమ గుండాలను అద్భుతంగా అలంకరించారు. 100 మంది కర్తలు 9 లక్షల ఆహుతులను జగన్మాతకు అందించారు. హోమంలో పాల్గొనే ముందు, సాధకులు చండీ మంత్ర దీక్షను స్వీకరించి ఒకటిన్నర నెలల్లో నాలుగు కోట్ల మంత్ర జపం పూర్తి చేశారు.









## వనదుర్గా పురశ్చరణ హోమం

అత్యంత శక్తివంతమైన వనదుర్గా పురశ్చరణ హోమం, ఆగస్టు 13 నుంచి 15 వ తేదీ వరకు గుంటూరు జిల్లాలోని సత్తెనపల్లిలో నిర్వహించబడింది.

50 మంది శ్రీవిద్యా ఉపాసకులు కలిసి లక్ష వనదుర్గా మంత్ర జపం, పదివేల హోమ ఆహుతులు, 1000 తర్పణాలు, 100 మార్జనలతో హోమం నిర్వహించారు.



# గురూజీ పర్యటన, రాబోయే కార్యక్రమాలు



## గురూజీ పర్యటన వివరాలు

సెప్టెంబర్ నెలలో గురూజీ పర్యటన వివరాలు

12, 13 తేదీలు – తిరుపతి
14 వ తేదీ – కాంచీపురం
మిగిలిన అన్ని తేదీలు – బెంగుళూరు

## శరన్నవరాత్రి ఉత్సవములు

సెప్టెంబర్ నెల 25 వ తారీఖు నుండి అక్టోబరు నెల 5 వ తారీఖు వరకు శరన్నవరాత్రి ఉత్సవములు శ్రీ విద్యా జ్ఞానపీఠమునందు నిర్వహించబడతాయి. యూ ట్యూబ్ మరియు ఫేస్ బుక్ అకౌంట్ లలో సబ్ స్క్రైబ్ అవటం ద్వారా పీఠానికి అండగా నిలుస్తున్న శిష్యులందరికీ గురూజీ మంత్ర దీక్ష ఇస్తారు.



మంత్ర దీక్ష కు రిజిస్ట్రేషన్ కోసం
https://forms.gle/Ge4jq4mZoZeTiLSg7
లింక్ ను సందర్శించండి.



## శ్రీ విద్యా తరగతులు

నవంబర్ లో రానున్న శ్రీ విద్యా తరగతుల గురించిన వివరాలు

మాడ్యూల్ 1 మరియు 2 (ఇంగ్లీషు) - **నవంబరు 12, 13,14** తారీఖులు, సాయంత్రం 5 గంటల నుండి 9 గంటలవరకు(భారత కాలమానం ప్రకారం)

మాడ్యూల్ 1 మరియు 2 (తెలుగు) – **నవంబరు 19, 20, 21** తారీఖులు సాయంత్రం 5 గంటల నుండి 9 గంటలవరకు(భారత కాలమానం ప్రకారం)

రిజిస్ట్రేషన్ కొరకు https://srimeru.org సంప్రదించండి.



# శ్రీ గురు కరుణామయ మార్గదర్శకత్వంలో నిర్వహించిన కార్యకలాపాలు

పరమ గురువైన శ్రీశ్రీశ్రీ అమృతానంద నాథ సరస్వతి సలహా మేరకు, గత 40 ఏళ్లుగా గురూజీ ప్రపంచవ్యాప్తంగా పర్యటించి ఎలాంటి లాభాపేక్ష లేకుండా, వేలాది మందికి ఔత్సాహిక సాధకులకు శ్రీవిద్యను బోధించారు.

గురూజీ, భారతదేశంలోనే కాకుండా యునైటెడ్ స్టేట్స్, కెనడా, యునైటెడ్ కింగ్‌డమ్, రష్యా, ఇటలీ, దక్షిణాఫ్రికా, సింగపూర్, మలేషియా, నేపాల్ మరియు వెస్టిండీస్ మొదలగు దేశాలలో శ్రీవిద్య నేర్పించారు. శ్రీ గురు కరుణామయ గారి మార్గదర్శకత్వంలో గతంలో జరిగిన కొన్ని కార్యక్రమాలు క్రింద ఇవ్వబడ్డాయి:

1. 67,600 చదరపు అడుగుల విస్తీర్ణంలో ప్రపంచంలోనే అతి పెద్ద శ్రీచక్రం క్రాన్‌బెర్రీ & డర్హామ్, న్యూజెర్సీ, USA లో భూమిపై గీశారు. ఈ శ్రీ చక్రములో 108 హోమ కుండములలో, 1000 మందికి పైగా ఉపాసకులతో శ్రీ లలితా హోమాన్ని నిర్వహించారు.

2. అట్లాంటిక్ మహాసముద్రం మధ్యలో కాళీ, లక్ష్మి మరియు సరస్వతీ ఉపాసకులతో లలితా హోమం నిర్వహించారు.

3. ప్రపంచం నలుమూలల నుండి వచ్చిన 200 మంది సాధకులతో, 6288 అడుగుల ఎత్తులో ఉన్న మౌంట్ వాషింగ్టన్ శిఖరంపై లలితా సహస్రనామ హోమం నిర్వహించారు.

4. మాస్కోలో 52 మంది క్యాథలిక్ మహిళలకు శ్రీవిద్యా ఉపాసనలో శిక్షణ ఇచ్చారు.

5. దక్షిణాఫ్రికాలో డర్బన్ మేయర్ సమక్షంలో ఔత్సాహిక భక్తులకు శ్రీ యంత్ర ప్రాముఖ్యతను వివరిస్తూ పృథ్వీ శ్రీ చక్ర పూజను నిర్వహించారు.











6. దక్షిణాఫ్రికా మరియు ప్రపంచంలోని ఇతర ప్రాంతాలలో వివిధ వికలాంగ పిల్లల కోసం ప్రత్యేక తరగతులు నిర్వహించారు.

7. సింగపూర్, కెనడా, USA మరియు భారతదేశంలో వేలాది మంది చిన్న పిల్లలకు వారి విద్యలో సహాయం చేయడానికి న్యాస మరియు ఇతర సాధారణ ప్రక్రియల ద్వారా సరస్వతి ఉపాసనలో శిక్షణ ఇచ్చారు.

8. ఆంధ్రప్రదేశ్‌లోని రాజమండ్రిలో 10,000 మంది విద్యార్థులతో సరస్వతీ హోమం 4 సంవత్సరాలు పాటు ప్రతి సంవత్సరం నిర్వహించారు.

9. ప్రపంచవ్యాప్తంగా ఉన్న శ్రీ విద్యా సాధకులకు సరైన ప్రామాణిక కొలతలతో ఉన్న శ్రీ యంత్రాలను తయారు చేయించి ఇచ్చారు. మరియు ప్రాణ ప్రతిష్ఠ ఎలా చేయాలో శిక్షణ ఇచ్చారు.

10. సమాజంలోని ఆర్థికంగా బలహీన పడిన ప్రజలకు నాణ్యమైన పోషక ఆహారాన్ని అందిస్తూ, నిత్యావసర వస్తువులను పంపిణీ చేస్తూ, విద్య మరియు వివాహాలకు సహాయం చేయడం ద్వారా సమాజ సేవను నిర్వహించారు.

11. వైవాహిక సంబంధాల పరిరక్షణకై భారతదేశం మరియు USA అంతటా అనేక ప్రాంతాల్లో శిక్షణా తరగతులను నిర్వహించారు.

**పీఠం తరపున నిర్వహించబడే కార్యక్రమాలలో మీరు కూడా భాగస్వాములు కావాలనుకుంటే, +91 80882 56632 నంబరుకు వాట్సాప్ సందేశం పంపండి, లేదా Srimeru website ను సందర్శించండి.**

## గురు వాక్యము

ప్రపంచం ఎలా ఉన్నా ఆమోదించు. నువ్వు ఎంతగా మారాను అనుకున్నా, ఇంకా విశ్లేషించు. ఇది శ్రీవిద్యా సాధన.

~ శ్రీ గురు కరుణామయ



gurUvaani

Srividya Learning Centre
#69, 6th Cross Street,
Girinagar Phase I, Bengaluru,
KA 560085, India.

srimeru999@gmail.com
+91 8088256632
www.srimeru.org

   